# విష్ణుభాగవత సుధాసింధు

## ప్రథమతరంగము.



(బమ్మెర పోతనామాత్యకృత గ్రంథస్థము.)

భక్తజన పఠన సౌలభ్యముకొరకు

కన్నెపాలెపు సూర్యనారాయణ శాస్త్రిచే

ప్రత్యేకముగా అచ్చువేయించబడినది

కళా మూల్యము.

శ్రీగురుభ్యోనమః.

శ్లో॥ జన్మాద్యస్యయతోన్వయాది తరతశ్చార్థేష్వభిజ్ఞ స్స్వరాట్। తేనేబ్రహ్మహృదా య ఆదికవయే ముహ్యంతియత్సూరయః॥ తేజోవారిమృదాం యథావినిమయోయత్రత్రిసర్గోమృషా। ధామ్నాస్వేన సదానిరస్తకుహకం సత్యంపరంధీమహి॥

సీ॥ విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వనివలన నేర్పడుచును
వర్తనమున।
వ్యావర్తనమ్మున, గార్యములం దభిజ్ఞుడై తాన రాజగు
జిత్తమున జేసి
వేదంబు లజునకు విదితముల్ గావించె నెవ్వడు
బుధులు మోహింతు రెవ్వ
నికి నెండమావులనీట గాచాదు లవనోర్యన్య
బుద్ధి దానదరుస్సత్ము

గీ॥ త్రిగుణసృష్టియందు దీపించు సత్యము।
భంగి దోచునట్టి పరిధు నిరస్త।
కుహకు డెవ్వడతని గోరి చింతించెద।
ననఘుసత్యుబతని ననుదినంబు॥

---

శ్రీరామ

# శ్రీమన్నారాయణావతారము

శుకుండు పరీక్షిన్మహారాజున కిట్లనియె,

క॥ భూమీశ్వర మైత్రేయ మహాముని
విదురునకునట్లు హరిగుణ శుభలీలా మహాత్మ్య
ముఁజెప్పిన । నా మైత్రేయునకు విదురుడనియెన్
మఱియున్॥

క॥ అగుణుండగు నీశ్వరుఁడు । జగదవనోద్భవ
వినాశ సత్కర్మములం । దగులీలలతైన నాతమ ।
నగుణుండై యుండుటెట్లు సౌజన్యనిధీ॥

క॥ చతురంతదీపింప పద్మజాపతులకు బతి యు
నగ వెలయు పద్మాపతియే । గతి పుట్టించెను ప్ర
వృత్తిపతులచే నవవిధ ప్రపంచము మఱియున్॥

క॥ సరసిరుహోదరు మంగళ । చరితామృత
పానతుతుకసంగంబున ని । ర్భరుడగు విదురునకు
మునీశ్వరుడగు మైత్రేయుడనియె సజ్జనతిలకా॥

సీ॥ అసఘ యేకోదకమైయున్న వేళసంతి
... రుద్ధానలదారువితతి । భాతి చిచ్ఛక్తి సమే

తుడై కపటనిద్రాలోలుడగుచు నిమీలితాక్షు।
డైన నారాయణుండంబు మధ్యమున భాసురసు
ధాసేవ పాండురశరీర।రుచులు సహస్ర శిరోరత్న
రుచులతో జెలిమిసేయగనొప్పు శేషభోగ।

తే॥ తల్పమున బవ్వళించి యనల్పతత్త్వ।
దీప్తి జెన్నొందగానద్వితీయుడగుచు। నభిరతుం
డయ్యు గోర్కులయందుబాసి। పరివిమలాకృతి
నానంద భరితుడగుచు॥

గీ॥ యోగమాయావిదూరుడై యుగ సహ
స్ర।కాల పర్యంత మఖిలలోకములు మ్రింగిపేర్చి
మఱికాల శక్త్యుపబృంహితమున। సమతసృష్టి
క్రియాకలాపములదగిలి॥

క॥ తనజఠరము లోపలదాఁచిన లోక నికా
యముల సృజించుటకును సా।ధనమగు సూక్ష్మా
ర్థము మన। సునగని కాలానుగతరజోగుణ
మంతట॥

సీ॥ పుట్టించె దద్గుణంబున బరమేశ్వరునాభి
దేశమునందు నళిననాళ।ముదయించె మఱియప్పు
డోరుహ ముకుళంబు గర్మబోధితమైన కాల

మందు। దనతేజమున బరివృద్ధంబైన జలముచే
జలజాప్తగతి బ్రకాశంబునొంద। జేసి లోకాశ్రయ
స్థితి సర్వగుణ విభాసితగతినొప్పు రాజీవమందు॥

గీ॥ నిజకళాకలితాంశంబు నిలిపి దానివలన
నామ్నాయమయుడును వరగుణుండు। నాత్మ
యోనియునైన తోయజభవుండు। సరవిజతు
రాననుండనునాదననమ్యు॥

మ॥ అతిగంభీర విశాలవారినిధి తోయాంత
ర్నిమగ్నాంగుడై। చతురాస్యుండొగి దివ్యవత్సర
సహస్రంబజ్జ మూలంబు సన్నతి వీక్షించియు
గానలేక భగవన్మాయా మహత్త్వంబువి। స్మృతి
గానింప విస్మితుడై మరల జేరెం దత్సరో జాత
ముగా॥

తే॥ అట్లు గ్రమ్మర జేటి యయ్యబ్జపీఠ। మందు
నష్టాంగయోగక్రియానురక్తి। బవను బంధించి
మహిత తపస్సమాధి। నుండె శతవర్షములు సను
చుండనంత॥

గీ॥ అట్టియోగ జనితమైన విజ్ఞానంబు। గలిగి
యుండె దానగమలనయను। గానలేక హృదయ

కమలకర్ణికయందు। నున్నవాని దన్నుగన్నవాని॥

మ॥ కనియెఁ నిశ్చలభక్తి యోగమహిమం
గంజాతగర్భుండు శోభనచారిత్రు జగత్పవిత్రు
విలసత్పద్మాకళత్రుఁ సుధాశన ముఖ్యస్తుతి పా
త్రు దానవచమూజైత్రుఁ దళత్పద్మ నేత్రు
నవీనోజ్జ్వల నీలమేఘ నిభగాత్రుం బక్షిరాట్ప
త్త్రునిఁ॥

చ॥ అలఘుఫణాతపత్త్ర నిచయాగ్ర సమం
చిత నూత్నరత్న నిర్మలరుచిచే యుగాంత తిమి
రంబు నడంచి యకల్మషోల్ల సజ్జలముల జేసియందు
నవసారసనాళసితైక భోగముం గలిగిన శేషతల్ప
మును గైకొనియున్న మహాత్ము నొక్కనిఁ॥

సీ॥ వరపీతకౌశేయ పరిధానకాంతి సంధ్యాం
బుదరుచినిచయంబుగాఁగ। కమనీయ నవహేమ
లలితకిరీటంబు రమణగాంచన శిఖరంబుగాఁగ।
మానిత మౌక్తిక మాలికారుచిసాను పతిత ని
ర్ఝర పరంపరలుగాఁగ। జెలువొందు నవతులసీ
దామకములు లాలిత తట ఔషధీ లతలుగాఁగ।

తే॥ వరభుజంబులు నికటస్థవంశములుగ।

బదములంగణపాద పద్మచయములుగ। లలితగతి
నొప్పు మరకతాచల విడంబి। గాత్రదేహంబు గ
లుగు మహాత్ము హరిని॥

వ. మఱియు నపరిచ్ఛిన్నంబును, నిరుపమా
నంబును, నిఖిలలోక సంగ్రహంబును, నతివిస్తా
రవర్తులాయమానంబునునై వివిధ విచిత్ర దివ్య
మణిభూషణంబుల నాత్మీయ నిర్మలద్యుతిచేతం
బ్రకాశంబు నొందజేయు దివ్యదేహంబు దనర;
వివిధంబులగు కామంబులభిలషించి విశుద్ధంబైన
వేదోక్త మార్గంబున భజియించు పురుషశ్రేష్ఠు
లకు గామధేను వనందగిన పాదపద్మయుగంబును
నలిక, ఫలక, లలిత రుచినిచయంబులకు నోటు
వడి కృపాపాత్రుండై చంద్రిందు ఇహలురూపం
బుల శతసరోజంబుల నాశ్రయించె ననదొప్పు
పదనఖంబులును; కమలాభూకాంతలకు నుపధా
న రూపంబు లనందగ నీలకదళికా స్తంభంబు
లడంబు విడంబించు నూరుయుగళంబును; కనక
మణిమయమేఖలాకలాపాఢ్య రామంబును, గదం

బకింజల్క శోభిత పీతాంబరాలంకృతంబునై విలసిల్లు కటిమండలంబును, శృంగార వాహినీ జలావర్తంబునాఁ బొలుపొందు నాభీవివరంబును; జఠరస్థ నిఖిల బ్రహ్మాండ ముహుర్ముహురుద్భవ కృశీభూతం బనఁగు మధ్యభాగంబును, మహిత ముక్తా ఫలమాలికా విరచిత రంగవల్లీ విరాజితంబు, నవతులసీదామకిసలయ తల్పంబు, కుసుమ మాలికాలంకృతంబు, ఘనసార కస్తూరికా చందన విలిప్తంబు, కౌస్తుభరత్న దీప్తిప్రదీప్తంబు, శ్రీవత్సలక్షణ లక్షితంబు నై, యిందిరా రమణికి కేళీమందిరంబనం బొల్చు వక్షస్థలంబును సుఖకేళీసమారంభ పరిరంభణాంభోధి రాట్కన్యకా కరాంభోజ కలిత కనకమణి కంకణ నికషంబులనం బొలుపారు రేఖాత్రియ విరాజమానంబైన కంధరంబును; సుమహితానర్ఘ్య దివ్యమణి ప్రభావిభాసిత కేయూర, కంకణ, ముద్రికా లంకృతంబులైన బాహువులును, సకలలోకార్తి నివారక దరహాస చంద్రికా ధవళితంబులైన, కర్ణ కుండల మండన మణిమరీచులు సరసంబులు న

లువం దనరి, నిద్దంబులగు చెక్కుటద్దంబులును,
బరిపక్వబింబఫల, ప్రవాళ, పల్లవా, రుణాధరం
బును; సకల భువన పరిపాలనంబునకు నేనచాలు
దునని వివాదించు నయనయుగళంబునకు సీమా
స్తంభంబు, జంపక ప్రసూన రుచివిభాసంబునగు
నాసాదండంబును; గమల కుముదంబుల కుంటెం
పు నంపదించుచు, గరుణామృత తరంగితా
పాంగంబులై, కర్ణవిశ్రాంతంబులై, చెలువొందు
నేత్రంబులును; సలలిత శ్రీకారంబునకు సత్వర
త్వంబు సార్థకంబయ్యె ననందగు కర్ణంబులును;
నిక్షుచాపన్వయంబునాజూపట్టు భ్రూయుగళంబు
ను, నపరపక్షాష్టమీ శశాంక శంకాస్పద ఫాల
ఫలకంబును; నీలగిరిప్ర శృంగసంగత బాల
మార్తాండమండల ప్రతిబింబ, పద్మరాగమణిఖచిత,
కాంచనకిరీటంబునం బొలుపారి, సూర్యేందు పవ
నానల ప్రకాశంబులకు నవకాశంబు సూపక, త్రి
లోకవ్యాపక సమర్థంబులగు తేజోవిశేషంబుల జె
లువొంది సంగరరంగంబున దానవానీకంబుల హ
రింపంజాలు సుదర్శనాది దివ్యసాధనంబుల చేమరా

సదంబగు దివ్యరూపంబునుం గలిగి మఱియును,

ఉ॥ హారకలాప పుష్పనిచయంబుల జంచద
నర్ఘ్యరత్నకే।యూర కరాంగుళీయక మహోజ్జ్వల
బాహుసహస్రశాఖలౌ। స్ఫారగ జూడనొప్పి
భువనాత్మకలీల నదృష్టమూల వి।స్ఫారిత భోగి
వేష్టిత విభాసిత చందన భూరుహాకృతిన్॥

మ॥ విలసత్కుండలి రాజసఖ్యమున నుర్వీ
భృత్సమాఖ్యన్। సముజ్జ్వలితోదార శిరోవిభూ
షణ సహస్రస్ఫూర్జితాటంబులన్। సలిలావాసత
జారుకౌస్తుభ విరాజద్రత్న గర్భంబునన్। నలినా
త్ముండు గనుంగొనంగదగె మైనాకావనీ భృద్గతిన్॥

క॥ సితతార్క్ష్యజ్ఞాన పద।స్తుతి మకరంద ప్రహృ
ష్టశ్రుతిజాత మధు। వ్రతగణ పరివృతశోభా।
గతకీర్తి ప్రసవమాలికలుగలవానిన్॥

వ॥ కనుంగొని చతురాననుం డిట్లని స్తుతించె

సీ॥ నలినాక్ష మాయాగుణ వ్యతికరమున,
జేసి కార్యంబైన సృష్టిరూప। [illegible]న ప్రకాశించు
నీఘనరూప విభవంబు రూపింప దేహధారులకు
దుర్వి। భావ్యంబు దలపోయ భగవంతుడవునైన

పద్మాత్మ నీస్వరూపంబుకంటె । నన్యమొక్కటి సత్యమై బోధకంబైన యదిలేదుగాన నీయుతుల దివ్య । గీ॥ మైనరూపంబునాకు బ్రత్యక్ష మయ్యె । నదియుగాక వివేకోదయమున జేసి । తత్తద నీరూప మజ్ఞాన గురుతమోని । వారకంబయ్యె నాకు శశ్వత్ప్రదీప॥

క॥ ఘన సత్పురుషా నుగ్రహ । మునకై యుమితావతార మూలంబగుచుం । దనరెడి నీరూపము శో । భనమగు ; భవదీయ నాభిపద్మము వలనన్ ॥

క॥ జననంబందిన నాచే । ననయము మొదలనె గృహీతమయ్యె జగత్పా । వన నీమ సుస్వరూపము । ఘనరుచిరంబై స్వయం ప్రకాశకమగుటన్ ॥

వ॥ మఱియు జ్ఞానానంద పరిపూర్ణమాత్రంబును, ననావృత ప్రకాశంబును, భేదరహితంబును, ప్రపంచజనకంబును, ప్రపంచ విలక్షణంబును, భూతేంద్రియాత్మకంబును, నేకంబునైన రూపంబునొందియు నెందును బాధగాన

కట్టి నిన్ను నాశ్రయించెద ; నదియునుంగాక, జగన్మంగళ స్వరూప ధరుండవై నీయుపాసకులమైన మామంగళంబుల కొఱకు నిరంతర ధ్యానంబుచేత నీదివ్యరూపంబునం గానంబడితి విట్టినీవు నిరయభాక్కులై నిరీశ్వరవాదంబునం జేసి కుతర్కంబులు ప్రసంగించు భాగ్య రహితులచేత నాదృతుండవుకావు మఱియుం గొందరు కృతార్థులైన మహాత్ములు భవదీయ శ్రీచరణారవింద కోశగంధంబు వేదమారుతా నీతంబగుటం జేసి తమ తమ కర్ణకుహరంబులచేత నాఘ్రాణించుచుండుదురు వారల హృదయకమలంబుల యందు భక్తిపారతంత్ర్యంబున గృహీతపాదార విందంబులు గలిగి ప్రకాశింతు వదియుంగాక వ్రాణులకు ద్రవ్యాగార సుహృన్నిమిత్తంబైన భయంబును దన్నాశనిమిత్తంబైన శోకంబును ద్రవ్యాది స్పృహయును దన్నిమిత్తంబైన పరిభవంబును మఱియు నందుతృష్ణయునధ ప్రయాసంబు నలబ్ధంబైన నార్తిమూలంబగు లేదీయం బైన వృథాగ్రహంబునుని శ్రీపాదార విందంబులందు

వై ముఖ్యంబైన కాలంబుగలుగు నంతకాలం
బును బ్రాప్తంబులగుంగాని మానవాత్మ నాయ
కుండవగు నిన్నాశ్రయించి నభయనివృత్తి
హేతువైన మోక్షంబు గలుగు మఱియును
గొందరు సకలపాప నివర్తకంబగున త్వదీయ
నామస్మరణ కీర్తనంబులందు విముఖులై కామ్య
కర్మ ప్రావీణ్యంబునంజేసి నష్టమతులై యింద్రి
య పరతంత్రులై యమంగళంబులైన కార్యం
బులు సేయుచుందురు దానంజేసి వాతాదిత్రి
ధాతు మూలంబైన క్షుత్తృడాది దుఃఖంబుల
చేతను శీతోష్ణ వర్షవాతాది దుఃఖంబులచేతను
నతిదీర్ఘంబైన కామాగ్ని చేతను నవిచ్ఛిన్నంబు
గు క్రోధంబు చేతను దహ్యమానులగుదురు వా
రలగనిన నాచిత్తంబు గలంకంబొందు జీవుండు
భవదీయ మాయాపరిభ్రామ్యమాణుండై యా
త్మవేఱని యెప్పుడు దెలియునంతకాలంబు నిరర్థ
కంబై దుస్తరంబైన సంసారసాగరంబు దరియిం
పంజాలకుండు నమ్మునీంద్రులైనను భవదీయనా
మస్మరణంబు మరచి యితర విషయాసక్తులైరేని

వారలు దివంబులందు వృథాపరియత్నులై సం
చరించుచు రాత్రులయందు నిద్రిసక్తులై స్వ
ప్నగోచరంబులైన బహువిధ సంపదలకు నానం
దించుచు శరీర పరిణామాది పీడలకు దుఃఖించుచు
చుం బరితాపతంబులైన యుద్యోగంబుల భూ
లోకంబున సంసారులైన వర్తింతురు నిష్కామ
ధర్ములై నిన్ను భజియించు సత్పురుషుల కర్ణ
మార్గంబులం బ్రవేశించి భవదీయ భక్తియోగ
పరిశోధితంబైన హృత్సరోజ కర్ణికా పీఠంబున
వసియింతు వదియెట్లనుంగాక॥

మ॥ వరయోగీంద్రులు యోగ మార్గముల
భావంబందు నేనీమనో। హరరూపంబు దలంచి
యే గుణగణధ్యానంబు గావింతురు। వ్వురుష శ్రీ
వ్య పరిగ్రహంబునకునై పొల్పారతద్ధ్యాన గోచర
మూర్తిన్ ధరియింతుగాదె పరమాత్మాహాంద
వై మాధవా॥

తే॥ అతయు నిష్కామధర్ములైనట్టి భక్తులం
దు నీవు బ్రసన్నుండవైన రీతి। హృదయముల బ
ద్ధకాములై యనయు దేవ। గణములందు బ్రోసి

న్నత గలుగవీవు॥

చ॥ అరయ సమస్తభూత హృదయంబుల యందు వసించి యేకమై। పరగి సుహృత్క్రియా ను గుణభాసిత ధర్ముడవుం బరావరే। శ్వరుడవు నై తనర్చుచు నసజ్జన దుర్లభమైనయట్టి సు। స్థిర మగు సర్వ భూతదయచే బాడగానగ వత్తు వచ్యుతా॥

మ॥ క్రతుదానోగ్ర తపస్సమాధి జపసత్కర్మాగ్ని హోత్రాఖిల। వ్రతచర్యాదుల నావతింపవఖిల వ్యాపార పారాయణ। స్థితినొప్పారెడి నీపదాబ్జయుగళీ సేవాభిపూజా సమా। శ్రిత ధర్మం బగువానిభంగి ననురారీ దేవమాహాత్మనే॥

తే॥ తవిలి శశ్వత్స్వరూపమై తనరి భూమి। మహిమచేతనపాస్త సమస్త భేద। మోహమున వఖిల విజ్ఞానమునకు నాశ్రి। యుండవగునీకు మ్రొక్కెద నోరమేశ॥

క॥ జననస్థితి విలయంబుల। కనయంబును హేతుభూతమగు మాయాలీ। లను జెంది నటనసలి పెడు। ననభూతాత్మక నీకొనర్తు నభివందనముల్॥

తరళ॥ జననవృద్ధి వినాశ హేతుక సంగతిం
గల యేను నీవును హరుండు ద్రిశాఖలై మను
వుల్ మరీచిముఖామరుల్। దనరనం దుపశాఖలై
భవదాత్మ దీనికి మూలమై। యనయముఁ భు
వన ద్రుమాకృతివైన నీకిదె మ్రొక్కెదఁ॥

మ॥ పురుషాధీశ భవత్పదాబ్జయుగళీ పూ
జాది కర్మక్రియా। పరతం జెందని మూఢచిత్తుని
జశుప్రాయుఁ మనుష్యాధముఁ। జరయుఁ
నాశము నొందజేయు నతివక్రంబైన కాలంబు
త। ద్గురు కాలాత్ముడవైన నీకు మదిసంతోషం
బునఁ మ్రొక్కెదఁ॥

చ॥ భవదుదర ప్రభూతమగు పద్మమునందు
వసించియున్ననే। నవిరళ తావకీన కలితాంశమునం
దనరారు విశ్వముం। దవిలి రచించుచుఁ బహు
విధంబుల బల్కెడి వేదజాలముల్। శివతరమై ఫ
లింప గృపసేయుము భక్తఫల ప్రదాయకా॥

చ॥ అనియజు డంతలోఁ బ్రవినయంబున జాగి
లి మ్రొక్కి చారులో। చన సరసీరుహాండమగు మ
సర్వజగత్పరిపాలనా రతిం। దనరెడి సన్ము వ్రోభులు

డుదానిటు సన్నిధిమైన యీశ్వరుం।డనయము నా
దు దుఃఖము దయామతిబాపెమనంచు నమ్రుడై ॥

తే॥ అట్లు వొడగని యార్తుడై నట్టి పద్మ। భ
వుని వాంఛితమాత్మ దీర్పంగ దలచి। యతని మో
హానివారకమైనయట్టి। యమృత రసతుల్యమధుర
వాక్యములననియె ॥

క॥ నీకిప్పుడు గానంబడె। నాకులకును సురగ
పతిపినాకులకైనన్। వాకొనగం దలపోయను।
రాకుంను మదీయ రూపరమ్యత్వంబుల్ ॥

క॥ కావున మచ్చారిత్రిక। ధావిలసితమై
న సుమహితస్తవము జగ। త్పావనము విగతసం
శయభావుడవై బుద్ధినిలుపు పంకజజన్మా ॥

క॥ సగుణుడనై లీలార్థము। జగముల గల్పిం
పదలచు చతురుడనన్నున్। సగుణునిగా నుతియిం
చితి। దగసంతసమయ్యె నాకు దామరసభవా ॥

క॥ అనుదినమును ద్విజగత్పా। వన మగుని
మంగళస్తవంబు బఠియింపన్। వినినను జనులకు నే
బొడ।గనబడుదు నవాప్తసకల కాముడనగుచున్ ॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# ప్రకటన విన్నపము.

---

ఈరీతిగ నింకకొన్ని ముఖ్యవిషయములు ప్రచురించబడును.

గురుస్మరణ ప్రథమమం దవసరము కనుకను, నారాయణ పద్మభువులు స్మార్త గురు పరంపరకు ప్రథములు కనుకను, వీరినిగురించిన యీతరంగము మొదట వెడలినది. విశిష్టాద్వైతద్వైతులకు గూడనిది సమ్మతమేకదా. కనుక సత్పురుషు లందరీకార్యమునకు సహాయులగుదురని దైవమును ప్రార్థించుచున్నాను.

సుజనవిధేయుడు,

కర్లపాలెము సూర్యనారాయణశాస్త్రి

బాపట్ల. దుర్మతివత్సర పుష్య శు౧౧ సోమవారం

విజయ ముద్రాక్షరశాల, బాపట్ల.

జనవరి.

1922.

